



The Andhra Patrika, Madras. Regd. No. M. 1118 Vol. 36 No. 24 MONDAY 25th APRIL 1949 వెల ఒకఅణా Founder: K. Nageswara Rao

# రిపబ్లికన్ భారతదేశానికి స్థానం ఉండేవిధంగా కామన్వెల్తు పునర్నిర్మాణం

## పాకిస్తాన్ సరిహద్దుకు ఆఫ్ఘనిస్తాన్ సేనలు

### బి. బి. సి. వార్తఖండన

('ఆంధ్రపత్రిక' విలేఖరి)

న్యూఢిల్లీ, ఏప్రిల్ 23 : ఆఫ్ఘనిస్తాన్ పాకిస్తాన్ సరిహద్దుకు సేనలను పంపించినట్లు బ్రిటిష్ బ్రాడ్ కాస్టింగ్ కార్పొరేషను ప్రచారంచేసినవార్తను కొబూల్ పత్రిక 'అనస్' నేడు 'నిరాధారం' అని ఖండించినట్లు తెలిసింది.

"పాకిస్తాన్ దురాక్రమణ, దుష్ప్రచారం పట్ల ఆఫ్ఘనిస్తాన్‌లో ప్రజలు అందరూ ఉద్రిక్తులై ఉన్నప్పటికీ సరిహద్దులకు ఆఫ్ఘన్ ప్రభుత్వం తనసేనలను నడిపించలేదు" అని ఈపత్రిక ప్రకటించింది.

### పీర్ సాహెబ్ ప్రకటన

డేరా ఇస్మాయిల్ ఖాన్, ఏప్రిల్ 23 : సరిహద్దు రాష్ట్రంలో ఖయ్యూం మంత్రి వర్గంపై చేయబడిన ఆరోపణలను గురించి విచారణ జరిపించ వలసిందిగా కోరుతూ జకోరామరాఫ్‌కు చెందిన పీర్ సాహెబ్ నేడొక ప్రకటన చేసెను. ఖయ్యూం ఖాన్ తన నిరంకుశ పరిపాలనను కొనసాగించుటకు పాకిస్తాన్ ప్రభుత్వము ఆమోదించినట్లయితే సరిహద్దు రాష్ట్రానికి దుర్గతితప్పదని పీర్ సాహెబ్ చెప్పెను. పాకిస్తాన్ స్థాపనతో పేదప్రజల కష్టములు తొలగి పోగలవని ఆశపడినామనీ, ఖయ్యూంఖాన్ నాయకత్వాన రాష్ట్ర పరిపాలన తద్వ్యతిరేకంగా జరుగుతోందనీ ఆయన తెలియజేసెను. "ఖయ్యూంఖాన్ ప్రభుత్వాన్ని వెంటనే అంతరింపచేసి రాష్ట్ర రాజకీయ జీవితాన్ని చక్కచేయవలెను" అని ఆయన చెప్పెను.

## లండన్ సభ కొత్త పథకాన్ని సాధింపగలదని బ్రిటిష్ పత్రిక నమ్మకం

### రెండు వర్గాలుగా కామన్వెల్త్ విభజన : క్రిప్స్ ఆలోచన

లండన్, ఏప్రిల్ 24 : రిపబ్లికను భారతదేశము కామన్వెల్తులో ఉండడానికి వీలు అయినట్టి ఒక కొత్త పథకం తయారు కాగలదని ఆశించడానికి తగిన దాఖలాలు ఉన్నవని బ్రిటిష్ సహకార సంఘముల పత్రిక రేనాల్డ్స్ న్యూస్ నేటి సంపాదకీయంలో వెల్లడించినది. బ్రిటన్‌కూ భారతదేశానికి అనేక విషయాల్లో సామ్యం ఉందనికూడా ఈ పత్రిక వ్రాసింది.

"రాజకీయలక్ష్యాలు రెండు దేశాలకూ ఒకేవిధంగావున్నది. మనిషిమనిషికీ ఉండవలసిన సంబంధాలు, మనిషికీ రాజ్యానికి ఉండవలసిన సంబంధాలు గురించి రెండు దేశాల ప్రజలకు ఒకేవిధమైన భావాలున్నవి. ఒక దేశానికి మరొకదేశం సహాయం అవసరం. వ్యాపారం, పరిశ్రమలు మొదలైన వ్యవహారాల్లో ఒకరికొకరు సహాయం చేసుకోవచ్చును. రక్షణ, శాంతిస్థాపన సమస్యలు ఉభయులనుసన్నిహితంచేసినవి."

"అందరికీ అనుకూలంగా, ముఖ్యంగా భారతదేశం కామన్వెల్తులో ఉండడానికి వీలైన పథకం తయారు కాగలదని ఆశించడానికి అవసరాలకు తగ్గట్టుగా కామన్వెల్తు నిబంధనావళి మారిపోగలగడమే ఈ ఆశకు రెండో కారణం. ఆసియా, పాశ్చాత్య నాగరికత ఐచ్ఛికసమైక్యత సాధ్యపడునట్లు చేయగల శక్తి ఈ కామన్వెల్తు సమావేశానికి ఉంది. భారతదేశం కామన్వెల్తులో ఉండడానికి నిశ్చయించుకుంటే, బ్రిటన్ అధికార ప్రదానంకంటే కూడా అది చరిత్రాత్మకమైన నిర్ణయం కాగలదు." అని ఈ పత్రిక ఈ సంపాదకీయ వ్యాసాన్ని ముగించింది.

### ఇండియాను ముడిపెట్టడానికి క్రిప్స్ పథకం

బ్రిటిష్ ఖజానామంత్రి భారతదేశానికి అధికారం అప్పగించటంలో మొదటినుంచీ వ్యవహరించిన వాడూ అయిన సర్ స్టాఫర్డ్ క్రిప్స్ ఇండియాను కామన్వెల్తులో ఉంచటానికి ఒక కొత్తపథకం ప్రతిపాదించినట్లు తెలుస్తున్నదని ఇతడు వ్రాస్తున్నాడు. ఈ పథకం ప్రకారం కామన్వెల్తులో బ్రిటిష్ రాజు ఆధిక్యతను అంగీకరించే దేశాలంతా ఒక వర్గంగా తయారు కావలెననీ, మిగిలిన రిపబ్లిక్ దేశాలన్నీ మరొక వర్గంగా ఉండవలెననీ, అయితే అందరు సభ్యులకూ ఒకేవిధమైన హక్కులు సౌకర్యాలుఉండవలెననిసూచించబడినదట. మొదటివర్గం బ్రిటిష్ కామన్వెల్తు అని పిలువబడవలెననీ, అందులో సభ్యులు బ్రిటిష్ రాజుకూ, మిగిలినరిపబ్లిక్ దేశాలకూ బాధ్యతవహిస్తారు. రెండువర్గాలూ కలిసినవిశాల కామన్వెల్తుకు ప్రధానపాలకుడుగా బ్రిటిష్‌రాజు ఉండవలెనట. ఈపద్ధతి ... బ్రిటిష్ ... దేశాలకు సంబంధించిన విషయాల్లో ఆయా దేశాల అధ్యక్షులయొక్క లేక బ్రిటిష్ రాజుయొక్క ప్రతినిధులుగా వ్యవహరించవలెనని మరొక పథకమూ సూచించబడినది.

## అహింసయే శిశు విద్యకు ప్రాతిపదిక

### మాంటిసోరీ వీడ్కోలు సందేశము

బొంబాయి, ఏప్రిల్ 23 : 'శిశువు యెడల అహింసా సిద్ధాంతమును వర్తింపజేయుటయే విద్యకు ప్రాతిపదిక, మార్గము' అని డా॥ మెరియా మాంటిసోరీ భారతదేశమునుండి వెళ్లిపోవుచు భారత ప్రజలకు సందేశమొసంగెను. అనేక సంవత్సరములు ఆమె భారతదేశములో శిశువిద్యకై కృషిచేసి యుండెను. నేను ఆమె కరాచీకి వెళ్లినది. అచ్చటి నుండి ఇటలీకి వెళ్లును.

## రష్యాపై విమానదాడికి కెనడాలో సన్నాహాలు

### పారిస్ శాంతిసభలో ఆరోపణ

పారిస్, ఏప్రియల్ 23 : కమ్యూనిస్టుల ఆధ్వర్యాన పారిస్‌లో జరుగుతున్న ప్రపంచ సమావేశంలో, అధ్యక్షుడు జె. గ్రోథర్ "చైనా ప్రజాస్వామిక సైన్యాలు నాన్‌కింగును విముక్తంచేసినట్లు ఇప్పుడే వార్తఅందింది." అని ప్రకటించాడు. సభికులంతా కొన్ని నిమిషాలపాటు సంతోషంతో కరతాళధ్వనులు చేశారు.

సమావేశంలో 59 దేశాలనుంచి 1800 మంది ప్రతినిధులు పాల్గొంటున్నారు.

"రష్యామీద 'లాంగ్ రేంజి అటం బాంబు' యుద్ధానికిగాను, మా ఉత్తరకెనడాలో, అప్పుడే స్థావరాలు నెలకొల్పారు. ఈ కార్యక్రమమంతా ఏ విధమైన పటాటోపమూ లేకుండా ఇట్టే నెమ్మదిగా చేసివేశారు" అని కెనడా ప్రతినిధి జి. ఎండికాంట్ తెలియజేశాడు.

"చైనాలో సంస్కరణలు కావాలని పోరాడుతున్న ప్రజోద్యమాలపైన ప్రయోగించటానికి మా దేశంనుంచి ఆయుధాలూ మారణ సాధనాలూ నిరంతరం రవాణా అవుతున్నయ్."

"ఆసియాలోనూ, చైనాలోనూ సాగుతున్న ప్రజోద్యమాలన్నీ రష్యాతాలూకు దురాక్రమణాలని, అక్కడ మా కెనడా ప్రజలకు అబద్ధాలు చెబుతున్నారు" అన్నాడు.

ఎండికాట్ చైనాలో పుట్టాడు, అక్కడే చిరకాలం మిషనరీగా పని చేశాడు.

## అంతరధినివేశ కమీషన్ చర్చలు

### అనేక అంశములపై అంగీకారం

లాహోరు, ఏప్రిల్ 23 : స్థానభ్రష్టులైన కాందిశీకులఆస్తి విషయమై సమాధానముకుదుర్చుకొను నిమిత్తం క్రిందటి మూడురోజులుగ ఇక్కడ సమావేశమగుచున్న ఇండియా పాకిస్తాన్ అధికారులు ఒకటి రెండు విషయములనువదిలి, మిగతా అన్ని విషయములపైనా ఒడంబడిక కుదుర్చుకొన్నట్లు తెలుస్తున్నది. సమాధానం కుదరని రెండువిషయాలను పరిష్కారంనిమిత్తం రక్షణార్థులసంఘానికి నివేదిస్తారని తెలుస్తున్నది.

అంతరధినివేశ కమిషన్ చర్చించిన విషయాలను పొందుపరుస్తు నేడీవిధంగా ఒక అధికారి ప్రకటన వెలువడింది.

"స్థానభ్రష్టులైన సైనరుల కోర్టు పరముగానున్న ఆస్తిసమస్య, రక్షణార్థులు లోగడ తాము ఉంటూవచ్చిన ప్రాంతాల వారివద్ద కుదువబెట్టిన ఆస్తి, వస్తువులను తిరిగి పొందుటకు ఏర్పాట్లు, ఒక అధినివేశంనుండి మరొక అధినివేశమునకు, స్థానభ్రష్టులైనవారు తమకార్లను తెచ్చుకొనుటకు సదుపాయాలు, వ్యావసాయిక ఆస్తిపై కాందిశీకులకు రావలసిఉన్న మక్తా వివరాలను గురించి అర్ధసంవత్సరం లెక్కలను తయారుచేయించడం, రక్షణార్థుల ఆస్తిపై మూడోపక్షంవారికి గల హక్కు పరిష్కారం, కోర్టులలో కట్టిన డిపాజిట్లను వాపసు పుచ్చుకోవడానికి సదుపాయాలు మొదలైన 9 అంశములను ఈ కమిషను చర్చించినది.

బ్యాంకుల విషయాలను విచారించటానికి ఏర్పడిన అంతరధినివేశ కమిషను చర్చలు నేడు ముగిసినవి. ఉభయులుచేరి ఒక ఒడంబడికను తయారు చేసినారు. ఆ ఒడంబడిక ఇండియా, పాకిస్తాన్ ప్రభుత్వాలు ఆమోదించడంలో అమలుకు వస్తుంది.

## రమణమహర్షి తపస్సు చేసిన పాతాళలింగ గుహ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 22: భారతగవర్నర్ జనరల్ సి. రాజగోపాలాచారి, దక్షిణదేశ పర్యటన సందర్భంలో మేనెల 14 న తిరువణ్ణామలై వెళ్లి పాతాళలింగగుహ ప్రారంభోత్సవం జరిపెదరు. ఇక్కడనె శ్రీ రమణమహర్షి తనచిన్నతనంలో తపస్సు చేసెను.

## షాంగైను ఖాళీ చేయడానికి ప్రభుత్వ నిర్ణయం

### సింకియాంగ్‌కు సేనల తరలింపు

### నగరపరిసరాల్లో కమ్యూనిస్టుగెరిల్లాలవిజృంభణ

షాంగై, ఏప్రిల్ 24: చైనా ప్రభుత్వ సేనలు గత రాత్రి నాన్కింగ్-షాంగై రైలుమార్గంమీదనున్న సూచౌరక్షణ కేంద్రాన్ని వదలి షాంగైకు ఆగ్నేయంగా 35 మైళ్ళదూరంలో ఉన్న సంకియాంగ్‌కు తరలి వెళ్లినట్లు తెలుస్తున్నది.

సూచౌనుండి వచ్చిన రాయిటర్ వార్తనుబట్టి, కమ్యూనిస్టు చక్రబంధంలో పట్టుబడిపోకుండా తప్పించుకునే నిమిత్తం ప్రభుత్వ సేనలు షాంగైనుకూడా వదలి వెళ్ళిపోవచ్చునని తెలుస్తున్నది.

### షాంగైపై గెరిల్లా దాడి

షాంఘయ్, ఏప్రిల్ 23 : నాన్కింగ్‌నుండి షాంఘయ్‌వైపుకి వస్తున్న కమ్యూనిస్టు సైన్యాలకు ముందు నడుస్తున్న కమ్యూనిస్టు గెరిల్లాదళాలు ఈ వేళ షాంఘయ్‌కి 10 మైళ్లదూరంలో, ప్రభుత్వ విమానాశ్రయానికి సమీపంలో ఉన్న ఒక గ్రామంపై దాడిచేసినవి. కొంతసేపు పోరాటం జరిగినమీదట ఆ దాడి తిరగగొట్టబడినదని ప్రభుత్వవర్గాలు తెలియజేస్తున్నవి.

ఇటు షాంఘయ్ ప్రాంతాల్లో కమ్యూనిస్టు దండయాత్రలు అవిచ్ఛిన్నంగా సాగిపోతుండగా అటు పశ్చిమ చైనాలో స్థానిక కమ్యూనిస్టులు సాగిస్తున్న గొరిల్లా యుద్ధం నానాటికీ విజృంభిస్తున్నది. కమ్యూనిస్టులు ప్రస్తుతం షాంఘయ్‌ని ఆక్రమించటం నిలిపివేసి ప్రభుత్వ సేనల్ని ముట్టడి వేయటంలోనూ, లేక వారి కొత్తరక్షణ శ్రేణిని నిర్మూలించటంలోనూ నిమగ్నులై ఉండవచ్చునని కొందరు పరిశీలకులు భావిస్తున్నారు. ఏది ఏమైనప్పటికీ యాంగ్‌సి నదికి దిగువ సరఫరా మార్గాలను వదిల పరచుకొననిదే వారు షాంఘయ్‌లోకి ప్రవేశించరని చెప్పవచ్చును.

### కమ్యూనిస్టుల వ్యూహం

షాంఘై, ఏప్రిల్ 23: వెయ్యి మైళ్ళ పొడుగుగల యాంగ్‌సీ రంగంలోని ప్రభుత్వసైన్యాలన్నిటినీ బ్రహ్మాండమైన చక్రబంధంలో చుట్టుముట్టి నిర్మూలం చేయవలెనని 8,50,000 మంది కమ్యూనిస్టులు అతి సాహసమైన పథకాన్ని నడుపుతున్నారు, ఇందులో వారు నెగ్గితే ఇంతవరకూ వారు సాధించిన మహత్తర విజయాలన్నిటినీ మించిన విజయాన్ని సాధించిన వారవుతారని ఇక్కడి సైనిక పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు. ప్రస్తుతం ఈ చక్రబంధ ప్రమాదానికి గురి అయిన 18 ప్రభుత్వ పటాలాల్లోనూ కలిపి దాదాపు 8 లక్షలమంది సైనికులుంటారు. అతివేగంగా ముందుకు తోసుకునివస్తున్న కమ్యూనిస్టు కర్తెరవ్యూహపార్శ్వాలు రెండూ కలుసుకోకముందే వీరు తప్పించుకోకలిగితే, దక్షిణానికి ఉపసంహరించుకుని నింగ్‌పో రేవునుంచి క్యాంగ్సీ రాష్ట్రంలోని నాంచంగ్‌వరకూ మరొక రక్షణశ్రేణిని ఏర్పరచవచ్చును.

యాంగ్‌సీ దగ్గర కమ్యూనిస్టులకు ప్రతిఘటించటంకన్నా ఇక్కడే నిలబడి పోరాడి ఉండవలసినదని మొదటినుంచీ కుమింటాంగ్ వ్యూహనిర్మాణ నిపుణులు వాదిస్తూ వచ్చారు. కర్తెర వ్యూహాన్ని వేస్తున్న కమ్యూనిస్టుసైన్యంలో కొత్తగా జనరల్ చెన్ యీ అధ్వర్యాన ద్వితీయ సైన్యము, మెరుపు యుద్ధంలో ఉద్దండుడయిన ఒంటికంటి సేనాని జనరల్ లియూపోచెంగ్ కిందఉన్న తృతీయ సైన్యము, జనరల్ చెన్‌కింగ్ నడుపుతున్న చతుర్థసైన్యముఉన్నవి. వీటిలో చెన్‌యీ కిందవున్న సైన్యం నాన్కింగ్‌నుండి తూర్పుగా తోసుకుని వస్తూ షాంఘయ్‌కి 70 మైళ్లదూరంలోకి వచ్చినది. చెన్‌కింగ్ కిందఉన్న సైన్యమే యాంగ్‌సీ నదిని వూహూదగ్గర పెద్దఎత్తులో దాటినది.

నాంకింగ్ నగరము, యాంగ్‌సీమీద ప్రభుత్వ రక్షణాలు అతిత్వరలో పేకముక్కలవలె కూలిపోవటంచేత కమ్యూనిస్టు సైన్యాలకు తెరపిచిక్కి తూర్పుగానూ, దక్షిణంగానూ ఉప్పెనవలె విరుచుకుని పడుతున్నవి. షాంఘయ్ నగరానికి మిగిలిన చైనాతో ఎంతమాత్రం సంబంధం లేకుండా చేయటానికి వీరుప్రయత్నిస్తున్నారు. కమ్యూనిస్టు అగ్రదళం షాంఘయ్‌కి 70 మైళ్లదూరంలో ఉన్న వూసీని ఆక్రమించుకున్నదని అక్కడినుంచి తిరోగమించిన ప్రభుత్వసైన్యం తెలియజేసినది.

### ప్రభుత్వ సేనానిద్రోహం

షాంఘయ్‌కి 80 మైళ్ళ దూరంలో ఉన్న యాంగ్‌సీ రేవు పట్టణం క్యాంగ్ కమ్యూనిస్టుల వశమైనది. ఆ నగరసేనాని జనరల్ టాయ్‌జొంక్‌వాన్ కమ్యూనిస్టులతో పరీకు కావటంతో నగరంహరిచే చిక్కినది. టాయ్‌జొంక్‌వాన్‌ను ప్రభుత్వోద్యోగులు వెంటనే కనిపెట్టికాల్చివేయించినా ప్రయోజనం లేకపోయినది.

## ఆంధ్రరాష్ట్రతీర్మానంప్పుడుపార్టీలో వచ్చినానాసానుభూతి ఉన్నది

### రాష్ట్ర శాసనసభ కాంగ్రెసుపక్షనాయకుని హామీ

చెన్నపట్నం, ఏప్రిల్ 24 : "శాసనసభా కాంగ్రెసుపక్ష సమావేశంలో ఆంధ్రరాష్ట్ర విభజననుగూర్చి ఏనాడు తీర్మానంవచ్చినానాసానుభూతి, సహాయం సర్వదా ఉన్నవి. ఈ విషయమై వెంటనే చర్యగావలెనంటే ఆంధ్రశాసన సభ్యులంతా ఒక్కమాటపై ఉండటం అవశ్యకము" అని మద్రాసు ప్రధాని శాసనసభ కాంగ్రెసు పక్షనాయకుడు పూసపాటి కుమారస్వామిరాజాగారు ఆంధ్రపత్రిక ప్రతినిధితో మాట్లాడుచూ చెప్పిరి.

"కుమారస్వామిరాజాగారిట్లు చెప్పిరి: గతవారంనాడు పార్టీలో తీర్మానము చర్చకు రావలెనని కొందరుకోరిరి. రాష్ట్ర పతి సమావేశమునకు రావలెనని నేను ఆహ్వానించితిని. సభకు పూర్వము పట్టాభిగారు ప్రకాశంగారిని సందర్శించివచ్చి తర్వాత వ్యవహారముతీసుకురావచ్చునని సూచించితి. సరేంటిని. ఏనాడుగాని ఆ తీర్మానం వచ్చిననూ, ఎప్పుడు తీసుకవచ్చిననూ నేను సహాయపడగలను. అయితే ఈ సందర్భంలో ఆంధ్రశాసనసభ్యులు, నాయకులు ఏకగ్రీవముగానున్నచో శీఘ్రం సులభంకాగలదు."

ఆంధ్రశాసనసభ్యులు నాయకత్రయ నివేదికను అంగీకరించి, ప్రస్తుతమునకు చెన్నపట్నముపై హక్కు వదలుకొన్నచో రాష్ట్రము భారతయూనియన్ రాష్ట్రమాలజాబితాలో చేర్చుటకు ఇది చక్కని అవకాశం. ఈ సందర్భమున ఎంత శీఘ్రముగా ఆంధ్రులు ఐక్యముగా తీర్మానము చేసుకొన్నచో అంతమేలు. లేనిచో రాష్ట్రము సంగతి వాయిదా పడుట ఖాయము, ఒక సారి వాయిదా పడితే మరి ఎప్పుడు వచ్చునో చెప్పలేను. వివాదాస్పదమైన సరిహద్దుల నిర్ణయమునకు తర్వాత సరిహద్దు నిర్ణయ సంఘమునాల్లో వచ్చి రాష్ట్ర సరిహద్దులను నిర్ణయించగలరు. ఆంధ్రులు విడిపోవుటకు తమిళులు ఎంతైనా సుముఖముగా ఉన్నారు. తమిళులు ప్రతిఘటించక సహాయపడగలరు. రాష్ట్రమును రావలసి ఉన్నట్లయితే రాజ్యాంగపరిషత్సమావేశములో ఏల ఆంధ్రులు, ఆంధ్రనాయకులు తీర్మానము చేసుకొనుట మంచిది."

### ఆంధ్రసభ్యుల కృషి

నాయకత్రయనివేదిక ననుసరించి వెంటనే రాష్ట్రప్రధాని ప్రభుత్వము కేంద్రప్రభుత్వము ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు చర్యతీసుకొనవలెనని, కొందరు శాసనసభ్యులు రాష్ట్రప్రధాని, కాంగ్రెసు పక్ష నాయకుడు అయిన కుమారస్వామి రాజాగారికి ఒక విజ్ఞప్తిని పంపుటకు, సంతకములు సేకరించుచున్నారని తెలియుచున్నది. కాంగ్రెసు అధ్యక్షునకు గూడా అట్టి విజ్ఞప్తినే సమర్పించుచున్నారు. దాదాపు యాభైమంది దానిపై సంతకములు పెట్టినట్లు తెలియుచున్నది. వీరైననూ చెన్నపట్నం ప్రత్యేకరాష్ట్రంగా ఉండటానికి తమ అభ్యంతరం ఏమీలేదనీ, అది తర్వాత చూసుకోవలసిన వ్యవహారమనీ తెలుపుచున్నారు. ఆంధ్రరాష్ట్రం తక్షణమే రావటానికి నాయకత్రయని వేదికను అంగీకరించక గత్యంతరం లేదనీ ఇప్పుడు తప్పితే ఆంధ్రరాష్ట్రం ఎన్నటికోగాని రాదనీ ఈవర్గం వారు తెలుపుచున్నారు.

## స్టాలిన్ - ట్రూమెన్ సమావేశము

### ఆస్ట్రియన్ కమ్యూనిస్టు నాయకుని సూచన

ప్రేగ్, ఏప్రిల్ 23: ట్రూమెన్-స్టాలిన్ సమావేశము జరుగవలెనని, ప్రాక్పశ్చిమములు సంధి చేసికొనవలెనని అన్ని దేశములవారు కోరవలెను. అని ప్రపంచ శాంతి సభకు ఆస్ట్రియన్ కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధిగా వచ్చిన ఎర్నెస్టుఫిషర్ చెప్పెను. 'దురాక్రమణ యుద్ధములలో మేము పాల్గొనము అని ప్రపంచములో గల యావన్మంది కార్మికులు ప్రకటింపవలెను. అనుబాంబు విస్తరణను అణు అస్త్రముల నిషేధమును కార్మికులు కోరవలెను' అని అతడు చెప్పెను.

### సిరియా ప్రభుత్వాన్ని గుర్తిస్తూ యీజిప్టు ప్రకటన

కెయిరో, ఏప్రియల్ 23: కలనల్ హుస్నీ ఎల్ జయీమ్ ఆధిపత్యాన నూతనంగా యేర్పడిన సిరియా ప్రభుత్వాన్ని గుర్తిస్తూ ఈజిప్టుప్రభుత్వంప్రకటన చేసింది.

## "రాయబారములు ఫలించగలవు"

### ప్రధాని కుమారస్వామి రాజాగారి విశ్వాసం

చెన్నపట్నం, ఏప్రిల్ 24 : "మంత్రివర్గ నిర్మాణమును గూర్చి నేనుచేయుచున్న యత్నములు, జరుపుచున్న రాయబారములు సఫలము కాగలవని నా విశ్వాసము. కొంచెం ఆలస్యమైనా గాని, సుస్థిరమూ, సంపూర్ణమూ అయిన మంత్రివర్గస్థాపన కావలెను. అట్టి మంత్రివర్గ నిర్మాణము పూర్తిగా ఈ పరిస్థితులలో అవసరము అని నేను గుర్తించితిని. వీలైనంతవరకు ఒక వారంరోజుల్లో ఈ వ్యవహారమును సాంతం చేయవలెనని నిశ్చయించుకున్నాను." అని మద్రాసు ప్రధాని పూసపాటి కుమారస్వామి రాజాగారు ఆంధ్రపత్రిక ప్రతినిధితో మాట్లాడుచూ చెప్పిరి.

ప్రధాని తాము కొందరు వ్యక్తులను మంత్రివర్గమున చేరవలెనని కోరితిమనియు, వారి నిర్ణయమును ఇంకనూ తెలుపలేదనియు, వారు చేరగలరనియే తాము దృఢముగా నమ్ముతున్నామనియు తెలిపిరి. మంత్రిపదవి నిచ్చెదమని తెలిపిన వెంకటస్వామి నాయుడుగారు మంత్రివర్గమున చేరి తమతో సహకరించుటకు వెంటనే అంగీకరించిరనియు అందువల్లనే మొదట వారు నిన్న ప్రమాణము గైకొనిరనియు, త్వరలోనే మిగతా వారు గూడా రాగలరని ఆశించుచున్నామనియు తెలిపిరి. తమకు, వ్యక్తికరము, రాష్ట్రమునకు ప్రయోజనకరమూ అయిన మంత్రివర్గము త్వరలో ఏర్పడినగాని తమకు మనశ్శాంతి లేదనిరి. ఈ విషయము అట్టే ఆపుచేయుటకు వీలు లేదనియు, త్వరలో తేల్చివేయ దలచుకున్నామనియు చెప్పిరి.

(3-వ పేజీలో మరికొన్ని వివరాలు)

### చెన్నపట్నంలో తెనుగువారి విద్యాసౌకర్యాలు

చెన్నపట్నంలో తెనుగువారి విద్యాసౌకర్యాలను గూర్చి వేసవి సెలవులలో పుల చెయ్యవలసిన సౌకర్యాలను గూర్చి వెంకటస్వామినాయుడు కమిటీవారి సిఫార్సులపై త్వరలో చర్య గైకొనవలెనని ఆంధ్రపత్రిక ప్రతినిధి సూచించగ తప్పక ఆ విషయమై తను చర్య తీసుకొనగలమని చెప్పిరి.

### నోటీసు

లిక్విడేటు కాబడిన నెం. H 1027 రు వుయ్యూరు కో-ఆపరేటివు అగ్రికల్చరల్ ఇండస్ట్రియల్ అండ్ క్రెడిట్ సొసయిటీ యందున్ను, నెం. H 1041 రు వుయ్యూరు సుగర్ కేన్ గ్రోయర్సు కో-ఆపరేటివు యూనియన్ లోను సభ్యులకు గల వాటాధనము డివిడెండు, బోనసు వగైరా మొత్తములు చాలవరకు వాపసు యివ్వబడినవి.

ఇంకను వాపసు పుచ్చుకొనక వున్న సభ్యులకు సదరు పద్దులు వాపసు యిచ్చుటకు నిమిత్తము, మిగతా మొత్తము విజయవాడ కో-ఆపరేటివు సెంట్రలు బ్యాంకులో వుంచడమైనది. వాపసు పుచ్చుకొనవలసిన సభ్యులు ఆ బ్యాంకుకు స్వయముగా వెళ్లి వారికి రావలసిన మొత్తములను 1-5-49 తేదీ మొదలు తీసుకొనవలెను. చనిపోయిన వారి కేసులలో వారి వారసులు గాని హక్కు నిరూపక పత్రములు పొందిన వారు గాని వాపసు తీసుకొనవచ్చును. వారితో తగిన సాక్షులను తీసుకొని వెళ్లుట అవసరము. ఇట్లు నిల్వచేయబడిన తేదీలగాయతు 3 సం॥ల లోపు వాపసు తీసుకొనని యెడల వారి హక్కులు పోగొట్టుకొనిన వారగుదురు. సభ్యుల సౌకర్యార్థము 1-5-49 తేదీ మొదలు 31-5-49 తేదీవరకు బ్యాంకులో ఒక గుమాస్తాను యిందుకుగాను నియమించడమైనది. కాన 31-5-49 తేదీలోగా వాపసు తీసుకొనవారికి గుమాస్తాగారిచే గుర్తించబడుట వగైరా సహాయము వుండును. వాపసు చేయవలసిన పైకం తాలూకు లిస్టులు బెజవాడలోని కో-ఆపరేటివు సొసైటీల డిప్యూటీరిజిస్ట్రారు వారి ఆఫీసువద్దను విజయవాడ కో-ఆపరేటివు సెంట్రలు బ్యాంకులోను వుంచబడినవి.

విజయవాడ, 20-4-49. } కె. నాగరత్నం దేవర,
కో-ఆపరేటివు సొసయిటీల డిప్యూటీ రిజిస్ట్రారు అండ్ లిక్విడేటరు.

(1) ది వుయ్యూరు కో-ఆపరేటివు అగ్రికల్చరల్ ఇండస్ట్రియల్ అండ్ క్రెడిట్ సొసయిటీ.

(2) ది వుయ్యూరుసుగర్ కేన్ గ్రోయర్సు కో-ఆపరేటివు యూనియన్.

### టెండరు నోటీసు

**కాకినాడ మునిసిపాలిటి**

ఈ మునిసిపాలిటీలో రోడ్ మెయింటెనెన్సు పనులకు 5-5-1949 తేది సాయంత్రము 3 గంటలవరకు సీల్డు టెండర్లు అంగీకరించబడును. మిగతా వివరములు దరఖాస్తుపై పొందవగును.

కాకినాడ, 19-4-1949 } కమీషనరు, కాకినాడ మునిసిపాలిటి.

## ఆరోగ్య మందిరము

సర్కసు మైదానము-గవర్నరుపేట, బెజవాడ

ఈ నెల శ్రీ భిషగ్రత్న డాక్టరు ఆచంట లక్ష్మీపతి బి.ఏ. ఎం.బి.సి.యం. గారు మద్రాసునుండి 28-వ తేది మంగళవారం ఉదయం బెజవాడకు వచ్చి 30తేది శనివారంవరకు బెజవాడలోనుండి రోగులను పరీక్షించి సలహా ఇచ్చెదరు. ఇచ్చట రోగులు నివసించుటకు చక్కని వసతిగలదు.

ఆరోగ్యమందిరం. బెజవాడ, 20-4-49. అయ్యంకి శ్రీరంగ, పర్సనల్ అసిస్టెంటు.

# ఆంధ్రనాటకరంగంలో గొప్ప విప్లవం తెచ్చిన ఆదర్శమూర్తి

## తాడిపత్రి రాఘవాచార్యుల వారికి ఆంధ్ర నటుల, కళాభిమానుల జోహార్లు

విజయవాడ, ఏప్రిల్ 20: నాట్యకళా ప్రపూర్ణ శ్రీ తాడిపత్రి రాఘవాచార్యుల వారి వర్ధంతి ఉత్సవము ఈ నెల 15 న స్థానిక నాటక సంఘములవారి ఆధ్వర్యాన జరిగింది. కపిల చిన వెంకటరావుగారు అధ్యక్షత వహించి, రాఘవ జీవితములోని చమత్కార ఘట్టాలు కొన్ని తెలిపారు. డి. వి. నరసరాజుగారు, రాఘవ ఆశయం అమెచ్యూర్ సంస్థలకు, నటులకు ప్రోత్సాహం ప్రోద్బలం లివ్వడమేనన్నారు. అయ్యంకి తాండవకృష్ణగారు, రాఘవాచారిగారి మూర్తిలో ప్రతిభదలికొ, చలన కళాస్ఫూర్తితో ఉట్టిపడుతూ ఉండేదన్నారు. వింజమూరి శివరామ్ గారు, రాఘవకళారంగంలో అమరమూర్తి అనీ, నాటక కళలో గొప్పవిప్లవం తెచ్చారనీ ప్రశంసించారు. వి. రాధాకృష్ణగారు మాట్లాడుతూ, లలితకళలు, ముఖ్యంగా నాట్యకళ నేర్పడానికి ఒక కళాశాల స్థాపించవలెననీ, నాటకాలు ప్రదర్శించేందుకు ఒక ఆదర్శ నాటకశాల నిర్మించవలెననీ రాఘవ కలలు కన్నాడనీ, ఆయన అభిమతం నెరవేర్చేందుకు ఆంధ్రులంతా కృషిచేయాలనీ అన్నారు. సభాంతాన రెండు నాటికలు ప్రదర్శితమైనాయి. (స్వ. వి.)

### పెద్దాపురం

పెద్దాపురం, ఏప్రిల్ 16: ఈ గ్రామమునగల అమెచ్యూర్ నాటకసంఘాల తరపున భారత థియేటర్సువారు నిన్నను రాఘవవర్ధంతి జరిపారు. జగన్నాథరాజుగారు అధ్యక్షత వహించారు. గోర్స నాగేశ్వరరావుగారు ప్రారంభోపన్యాసం చేశాక, నిరోగి సుబ్బారావు, మల్యాల జయరామయ్యగార్లు రాఘవకళాసేవను గురించి ఉపన్యసించారు. డాక్టర్ సి.ఎన్. రాజుగారు సుయోధనుని మయసభాప్రవేశము, పరాభవము, ప్రతీకారవాంఛా ప్రజ్వలనము ఘట్టమును ప్రదర్శించడంతో సభ ముగిసింది.

### ఏలూరు

ఏలూరు, ఏప్రిల్ 17: స్థానిక నెప్రహా నాట్యమండలివారు మొన్న శ్రీ రెండుచింతల సత్యనారాయణగారి అధ్యక్షతను రాఘవవర్ధంతి జరిపారు. వేమూరి గగ్గయ్య, కొచ్చర్లకోట సత్యనారాయణ, పంచాంగం రామానుజాచార్యులు, మొలకలూరి గోపాలరావుగారు హాజరైనారు. ఎస్. వి. ఎల్. నరసింహాచార్యులుగారు రాఘవ ఆంధ్రనాటకరంగానికి చేసిన సేవను కీర్తించి, అట్టివానికి ఆంధ్రులు స్మారక చిహ్నమైనా నెలకొల్పలేకపోవుట శోచనీయమన్నారు. ఆదర్శమూర్తి అగు ఆ మహానటుని స్మారకచిహ్నార్థమై ఆంధ్ర నటీనటులూ, కళాభిమానులూ యథాశక్తి విరాళాలిచ్చుట కనీస ధర్మమన్నారు. రెండు చింతలవారి వందనాలతో సభ ముగిసెను.

### కర్నూలు

ఏప్రిల్ 20: స్థానిక కర్నూలు, లలిత కళాపరిషత్తువారి యాజమాన్యమున కీర్తిశేషులైన నాట్యకళా ప్రపూర్ణ బళ్లారి టి. రాఘవాచార్యులవారి సంస్మరణ దినోత్సవము గత సుక్రవారంనాడు జరిగెను. జిల్లాజడ్జి శ్రీ యం. రామానుజాచారిగారు అధ్యక్షత వహించిరి. రాఘవగారు నాట్యకళకు చేసినసేవను గురించి బి. నారాయణమూర్తి, యన్. ఏ. వెంకట్రంగం ఆయ్యంగారు యం. సుబ్రహ్మణ్యశాస్త్రి, గాలి నారాయణరావుగార్లు ఉపన్యసించిరి.

### గుడివాడ

గుడివాడ, ఏప్రిల్ 19: నాట్య కళా ప్రపూర్ణ కీ. శే. రాఘవాచారిగారి వర్ధంతి ఈ 15-న స్థానిక శ్రీ రామవిలాస సభ (రిజష్టర్డు) కార్యాలయమందు ముదునూరి గుర్రాజుగారి అధ్యక్షతను జరిగింది. సభ కార్యదర్శి దేవర కొండ రామారావు, నూ, శోభనరావు, గుర్రాజు, ఉప్పలూరి కృష్ణమూర్తిగార్లు,ఆచార్యులుగారు నాట్యకళకై వారి జీవితము ఎట్లు అంకితము చేసిరో తెలిపిరి. తరువాత, దేవులపల్లి స్వామినాథశాస్త్రి, రాయప్రోలు ఆంజనేయ శాస్త్రి, తు సాంబశివరావుగార్లు జూలియస్ సీజరు,''కన్యాశుల్కం' 'మునుసేవ' నాటకములలోని ఘట్టములను ఏకపాత్రాభినయం చేసిరి. కార్యదర్శి రామారావుగారి వందనములతో సభ ముగిసెను.

## వీరేశలింగ వర్ధంత్యుత్సవాలు

రాజమహేంద్రవరం, ఏప్రిల్ 20: శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారి 101 వ జయంతియు, హితకారిణీ సమాజ వార్షికోత్సవము హితకారిణీసమాజము వారి ఆధ్వర్యమున యీ నెల 15, 17 తేదీలలో జరిగెను. జయంతిసభకు తెల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు అధ్యక్షత వహించిరి. మద్దూరి నాగభూషణరావుగారు కార్యదర్శి నివేదిక సమర్పించినపిదప వీరేశలింగంపంతులుగారి సర్వతోముఖ సేవను ఆయన సమకాలికులగల్ల పొందిన కష్టనిష్ఠురములను వివరించుచూ క్రొవ్విడి లింగరాజు, విద్యావతి, రావూరిసుబ్బమ్మ, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గార్లు మాట్లాడిరి.

వార్షికోత్సవానికి కంభంపాటి రామశాస్త్రిగారధ్యక్షత వహించిరి. దంగేటి నారాయణస్వామిగారు హితకారిణీసమాజ నివేదికను, అడివి శంకరరావుగారు వీరేశలింగ ఆస్తికోన్నతపాఠశాల కమిటీని వేదికను చదివినపిమ్మట అధ్యక్షు డుపన్యసించుచూ కొంతకాలమునుండి తగిన ఆదరణ లేక వెనుకబడియున్న పంతులుగారి సంస్థలు తిరిగి అభివృద్ధిలోనికి వచ్చుచున్నందుకు ఆనందము వెలిబుచ్చిరి. తర్వాత వీరేశలింగంపంతులుగారి సాంఘిక, సారస్వతసేవను గురించి ప్రస్తుత క్లిష్ట పరిస్థితులలో ఆంధ్రానని పంతులుగారి అడుగుజాడలలో నడవవలసిన ఆవశ్యకతనుగురించి మల్లెంపూడి అప్పారావు, దాసెర్ల వెంకట్రావు,రావూరి సుబ్బమ్మ, దంటు కృష్ణమూర్తి, మద్దూరి శివరాము, కృష్ణయ్యగార్లు ప్రసంగించిరి.

హితకారిణీ సమాజమునకు, పంతులుగారి యితర సంస్థలకు చాల సేవచేసిన పురప్రముఖులు డాక్టర్ పాలకోడేటి గురుమూర్తి, పెద్దాడ సుందరశివరావుగార్ల మరణమునకు సంతాపము వెలిబుచ్చుచూ సభలో తీర్మానము గావించబడెను.

### మదనపల్లి

మదనపల్లి, ఏప్రిల్ 18: స్థానిక అభ్యుదయ రచయితల సంఘము యాజమాన్యాన నిన్న కందుకూరి వీరేశలింగం పంతులుగారి వర్ధంతి జరిగినది. విద్వాన్ కె. సుబ్బరామప్పగారు అధ్యక్షత వహించారు. వీరేశలింగం పంతులుగారు ఆంధ్ర వాఙ్మయంలో వచన రచనకు, సాంఘిక సంస్కరణకు చక్కని పునాదులు వేసిరని అధ్యక్షులు సెలవిచ్చిరి. యం. వి. పాపన్నగుప్త, విద్వాన్ జి. నరసింహశర్మ పి. రామయ్యచౌదరి, విద్వాన్ సాధు శంకరశాస్త్రి, రవీంద్ర వర్మగార్లు పంతులుగారి భాషాసేవను, సాంఘిక సేవను కొనియాడుచూ ఉపన్యసించిరి. రవీంద్ర వర్మగారి అభినందనాలతో సభముగిసింది.

### విస్సాకోడేరు

విస్సాకోడేరు, ఏప్రిల్ 17: వీరేశలింగం పంతులుగారి జయంతి నిన్న నిచట జోస్యుల సూర్యనారాయణమూర్తిగారి అధ్యక్షతన జరగెను. వీరేశలింగంపంతులుగారు రచయితగా సంఘసంస్కర్తగా దేశమునకు చేసిన సేవ యపారమని వారు పన్యసించిరి. చేకూరి లచ్చిరాజుగారి వందనములతో సభ ముగిసెను.

### కోరుకొల్లు

కోరుకొల్లు, ఏప్రిల్ 17: శ్రీ గుడిపాటి శ్రీహరి కృష్ణగారి అధ్యక్షతను ఇక్కడ నిన్న శ్రీ వీరేశలింగ నూట ఒకటవ జయంతి 'కళాకారుల సమితి' యాజమాన్యాన్ని జరపబడింది. వి. యస్. సింహం, చె. సోమసుందరరావు తదితరులు పాల్గొన్నారు. ఇటీవల మహామహోపాధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ఆస్థానకవి నియామకం అక్రమ మంటూ గవర్నరు-జెనరల్‌కు అపీలు చేసినట్లు, పడిన వార్తను పురస్కరించుకొని, కృష్ణమూర్తి శాస్త్రిగారి వాదం హర్షించలేమని, మదరాసు ప్రభుత్వ ఉపసంఘం సూచించిన శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి నియామకం సముచితమైందని తీర్మానించారు.

కళాకారుల సమితి కన్వీనరు శ్రీ వి. యస్. సింహం అభినందనములతో సభ ముగిసింది.

### వల్లూరి సూర్యనారాయణగారి వర్ధంతి

కొవ్వూరు, ఏప్రిల్ 18: స్థానిక ఆంధ్ర గీర్వాణ పీఠమునకై తమ సర్వస్వం త్యాగమొనర్చిన కీ॥ శే॥ శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారి వర్ధంతి మొన్న తెల్లాప్రగడ ప్రకాశరాయడుగారి అధ్యక్షతను జరిగెను. సూర్యనారాయణరావుగారి జీవితవిశేషములను వారి సుగుణములను గూర్చి చర్లగణపతిశాస్త్రి, కె.వి.ఎన్. అప్పారావు, పుసులూరి కోదండరామయ్య, శ్రీమతి కొరప్రోలు సంగమ్మ, కూచిపూడి రామచంద్ర శాస్త్రి ఉపన్యసించిరి. పిమ్మట కళాశాల పరీక్షలలో ఉత్తములుగా తేలిన విద్యార్థులకు సూర్యనారాయణరావుగారు రచించిన పుస్తకములు బహుమానములుగా నొసంగబడెను. కళాశాలాధ్యక్షుని వందనములతో సభ ముగిసెను.

## దేశోద్ధారకుని వర్ధంతి

### రాజమహేంద్రవరం పత్రికా రచయితల సభ

రాజమహేంద్రవరం, ఏప్రిల్ 17: స్థానికపత్రికారచయితలు నిన్న శ్రీ పిస్సారి హనుమంతరావుగారి అధ్యక్షతను దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారి వర్ధంతిసభ జరిపిరి. నాగేశ్వరరావు పంతులుగారి మహత్తర జీవితసేవలను ఆయన ఆంధ్రలోకమున కొనరించిన రాజకీయ, సారస్వత సేవను వివరించుచూ శ్రీ తంగిరాల రామశేషు, తిమ్మరాజు వెంకటశివరావు, దంటు కృష్ణమూర్తిగార్లు ప్రసంగించిరి.

## హైద్రాబాద్ వ్యవసాయ సంస్కరణల సంఘం

హైదరాబాద్, ఏప్రిల్ 23: హైదరాబాద్ వ్యవసాయ సంస్కరణల సంఘ అధ్యక్షులుగా మైసూరు మాజీ దివాను ఎన్. మాధవరావుగారు నియమించబడినారని రూఢిగా తెలుస్తోంది. మైసూరు సంస్థానంలో వీరికి భూమిశిస్తు సమస్యలను గురించి దాదాపు 30 ఏండ్ల అనుభవమున్నది. హైద్రాబాద్ వ్యవసాయ సంస్కరణల సంఘంలోని యితర సభ్యుల పేర్లు త్వరలో ప్రకటించబడునని తెలుస్తోంది.

## డి. ఆర్. ప్రధాన్‌కువీడ్కోలు

హైదరాబాద్, ఏప్రిల్ 23: నిజాం రాజ్యాంగ సలహాదారునిగా నియమించబడిన డి. ఆర్. ప్రధాన్‌కు హైదరాబాద్ వాణిజ్య, పారిశ్రామిక మండలివారు నేడు బోట్సుక్లబ్బులో వీడ్కోలు విందొసంగారు. ఆ సందర్భంలో సమర్పింపబడిన పత్రానికి సమాధానమిస్తూ, తనకు పోలీసు చర్య తర్వాతనే హైదరాబాద్‌తో సంబంధం కలిగిందనుట సరికాదనీ, హైదరాబాద్ ప్రైవర్య విషయంలో జనరల్ రాజేంద్ర సింహజీతోకలసి పనిచేసే అవకాశం తనకు చిక్కిందనీ ప్రధాన్ చెప్పారు. ఒక సైనికుడుగా, నిర్వహణాధికారిగా రాజేంద్ర సింహజీశక్తిసామర్థ్యాలను ప్రధాన్ ప్రకంసించారు. భారత సర్వసేనాని పదవి యివ్వబోయి నప్పటికీ, తనకన్న సీనియర్ ఉద్యోగి వెనుకబడు త్రొక్కబడునని, రాజేంద్రసింహజీ దానిని నిరాకరించెనని కూడ ఆయన చెప్పెను.

## హైదరాబాద్‌లో 150 గుడారాల దహనం

హైదరాబాద్, ఏప్రిల్ 23 హైదరాబాద్ నగరంలో నేడు చాదర్ ఘాట్ ప్రాంతంలో ముస్లింకాందిశీకులకు చెందిన 150 గుడారములు దహనమై పోయినాయి. నిప్పు ఏవిధంగా అంటుకొనెనో తెలియలేదు. ఆస్తినష్టం దాదాపు 25 వేలని తెలుస్తోంది. ప్రాణనష్టమేమీ సంభవించలేదు. ఈ కాందిశీకులకు చుట్టుప్రక్కలనున్న ప్రజలు వసతి ఏర్పాట్లు చేస్తున్నారు.

## రాష్ట్రాలనుండి హైదరాబాద్‌కు పోలీసు దళాలరాక

హైద్రాబాద్, ఏప్రిల్ 23: హైదరాబాద్ చుట్టుప్రక్కలనున్న యూనియన్ రాష్ట్రాలనుండి సాయుధ పోలీసు దళములు ఐదు త్వరలో సంస్థానం వస్తున్నాయని తెలుస్తోంది. ఈ దళములు ఆత్రాఫ్ బల్దా వరంగల్లు, నల్లగొండ జిల్లాలలో కమ్యూనిస్టు ఉపద్రవాన్ని నిర్మూలించి, ప్రజలలో విశ్వాసం కలిగించుటకు ఏర్పాటు చేయబడును. ఈ ప్రాంతాలలో యిప్పటికప్పుడే మూడుసాయుధ పోలీసు దళాలు పనిచేస్తున్నాయి.

తూర్పుగోదావరిజిల్లా, రామచంద్రపురం తాలూకా ప్రాథమిక విద్యాసభలు మే 7, 8, తేదీలలో ద్వారపూడి గ్రామములో జరుగును. ఈ సందర్భమున వస్తుప్రదర్శనము జరుగును.

### ప్రకటన

**ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వే**

రాయచూరు గ్రెయిను షాపువద్ద బండ్లు వ॥ ఏర్పాట్లు నిర్వహించుట.

రాయచూరు, గ్రెయిను షాపువద్ద, 1-6-1949 తేది లగాయతు 6 నెలల వరకు గాని యీ లోగా గ్రెయిను షాపు అగ్రిమెంట్ రద్దు కానిచేసినచో, అంతవరకు గాని బండ్లు వ॥ ఏర్పాట్లు నిర్వహించుటకు, సీల్డు కవర్లలో టెండర్లు కోరబడుచున్నవి.

టెండర్లు నిర్ణీత ఫారములో పంపవలెను. కాపీ 1-కి ఖరీదు రు. 1/- (ఒక రూపాయి మాత్రమే) మద్రాసు, పార్కు టౌనులోని యీ రైల్వే పే-మాస్టరు అండ్ క్యాషియరు గారికి చెల్లించవలెను.

టెండర్లు పెట్టదలచువారు, ఫారము ఖరీదుక్రింద చెల్లించిన డబ్బుకు పే-మాస్టరు అండ్ క్యాషియరు వారిచ్చిన అఫీషియల్ రశీదు చూపి, దిగువ సంతకముదారు ఆఫీసు నుండి కంట్రాక్టు షరతులు, నిబంధనలతో సహా టెండరు ఫారము పొందవచ్చును. టెండరు ఫారము మార్చుకొనగూడదు. దాని ఖరీదు వాపసు యివ్వబడదు.

పూర్తి చేసిన టెండర్లు తీసుకొనుటకు ఆఖరు తేది 4-5-1949 తేది సాయంత్రము 3 గంటలు.

డిప్యూటి జనరల్ మేనేజరు,
21-4-49. మద్రాసు.

### నోటీసు

ఇందుమూలముగా తెలియజేయడమేమనగా 1890 సం॥పు ఇండియన్ రైల్వే ఆక్టు నెం. 9 రులోని 55 & 56 సెక్షనుల ననుసరించి, దిగువ వివరించిన సలములలో, సికింద్రాబాదు ఎన్. ఎస్. రైల్వే, చీఫ్ ట్రాన్సిట్ మేనేజరువారి ఆర్డరు ప్రకారం అన్ని అదనముగా నున్నట్టియు, క్లెయిము చేయనట్టియు, పార్సెల్లు, సరుకు, 16 హెవిమెషినరి భాగములు, 2 ఆయిల్ ఎక్స్పెల్లర్లు వేలంలో అమ్మబడును.

వేలాం అమ్మకం—అదనముగా నున్నట్టియు క్లెయిము చేయనట్టియు అన్ని పార్సెల్లు, సరుకు, బెజవాడ, రైల్వే సరుకు షెడ్ వద్ద 2-5-1949 తేది సోమవారం ఉదయం 11 గం॥లకు.

వేలాం అమ్మకం—15 హెవిమెషినరి భాగములు కొండపల్లి రైల్వే స్టేషను (ఎన్. ఎస్. ఆర్) వద్ద 3-5-1949 తేది మంగళవారం ఉదయం 11 గం॥కు.

వేలాం అమ్మకం—లాహోరునుండి వరంగల్‌కు 24-12-45 తేది గల నెం. 4, 5 ల ఇన్వాయిస్‌ల క్రింద బుక్ చేయబడిన 2 ఆయిల్ ఎక్స్పెల్లర్లు వరంగల్ (ఎన్. ఎస్., ఆర్.) సరుకు షెడ్‌వద్ద 5-5-1949 తేది గురువారం ఉదయం 11 గం॥లకు.

షరతులు:—ఇండియన్ గవర్నమెంటు కరెన్సీలో వెంటనే సొమ్ము చెల్లించవలెను.

కరపత్రములు దిగువవారి నుండి లభించును.

**Messrs. Vazir Sultan & Sons,**
The Popular Bona-fide & Govt. Railway, P.W.D. & Public Leading Auctioneers.
టెలిగ్రాం: "VAZIR" ఫోను: నెం. 7885











Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, G. T. Madras.